శ్రీ

# పన్నగాచలనాయక శతకము.



గ్రంథకర్త:

శ్రీ సచ్చిదానంద స్వరూపులగు

పులహరి వీరోజి దేశికేంద్రులు.

ఓమ్

శ్రీసద్గురుభ్యోన్నమః

# శ్రీపన్నగాచలనాయకశతకము.



గ్రంథకర్తః

శ్రీపులహరి పీర్దేశికేంద్రులు

శ్రీ కొల్లిపర సూరేశ్వరలింగం దేవరగారి
ద్రవ్య సహాయముచే
సచ్ఛాత్రింపబడి

---

శ్రీ పులహరి పీరోజి బాబుగారిచే
ప్రకటింపబడినది
1924

 వెల రు. 0-4-0

ఓమ్

# విజ్ఞప్తి.

---

ఆస్తికులారా ?

మదీయపితామహుండగు శ్రీ పులహరి వీరోజి దేశికేంద్రుల వారనేక సద్గ్రంథంబులు రచించి తద్గ్రంథంబులు ముద్రితంబులు గాకపూర్వమే బ్రహ్మైక్యసిద్ధి జెందిరి. తదుపరి నా తండ్రిగారగు శ్రీ లక్ష్మణ గురువరేణ్యులవారు తాళపత్రంబులపై శిథిలావస్థకు సిద్ధపడియున్న యా యుత్తమ గ్రంథంబులను కాగితంబులపై లిఖించి యందు "పరమానంద సుధాలహరి" యను గ్రంథమును మాత్రము ముద్రింపించి తక్కిన గ్రంథము లముద్రితములుగానున్న సమయముననే పరమపద మలంకరించిరి. తరువాత శ్రీ వీరోజి దేశికేంద్రులవారి ప్రియశిష్య శిఖామణులగు శ్రీ పాటిబండ్ల వీరయాచార్య గురువర్యులవారీ గ్రంథంబును బ్రకటింపదలంచి ముద్రణము గాక పూర్వమే బ్రహ్మైక్యమొందిరి.

నేనీగ్రంథమును శిథిలావస్థనున్న కాగితంబులనుండి తిరిగివ్రాయునప్పుడు లేఖకప్రమాదాది దోషంబుల సవరణలోను ప్రచురణసమయంబునను నాకన్నివిధంబుల సహాయపడిన అప్పికట్ల పురనివాసుండును పాటిబండ్ల వీరయార్యుల

వారి ప్రియశిష్యుండైన ఇనగంటి పున్నయ్యచౌదరిగారిని సద్గురుమూర్తి రక్షించుగాక!

ఈ పొత్తమునచ్చొత్తించుటకై ధనమొసంగిన చినపరిమి అగ్రహారవాస్తవ్యులును వీరశైవజంగములును శ్రీ వీరమహేశ్వరస్వరూపులును కొల్లిపర చెన్నమల్లయ్య దేవరగారి కుమారులైన సూరేశ్వరలింగం దేవరగారెంతయు కృతజ్ఞులు.

భాషాభిమానులెల్ల రీగ్రంథము సాంగోపాంగముగా దిలకించి తక్కిన గ్రంథముల బ్రచురించగలందులకై నాకు ప్రోత్సాహమును గలుగజేసి సహాయపడ [illegible]దులకు ప్రార్థితులు.

ఇట్లు,

సత్తెనపల్లి,
ది 22-12-1924.

ప్రకటనకర్త,
పులహరి పీరోజిబాబు.

# ఉపోద్ఘాతము.

---

ఆర్యులారా!

ఉత్తమపురుషార్థమగు మోక్షసౌధము నధిరోహించుటకు మొదటిమెట్టు భక్తి. అట్టి భగవద్భక్తి ప్రతిపాదకములగునవి యుత్తమగ్రంథములు. అట్టి యుత్తమ గ్రంథములలో నీపన్నగాచలనాయకశతక మొక్కటి యనుటకు సందియము లేదు.

ఈ శతకరాజమును రచించిన మహాత్ములు- శ్రీపుల హారి పీర్దేశికేంద్రులు- తండ్రి నర్సోజి. తల్లి నర్సూబాయి. జన్మస్థలము గుంటూరు మండలాంతర్గతమగు సత్తెనపల్లియను గ్రామము.

వీరు క్రీ॥ శ॥ 1829-30 సంవత్సరముల ప్రాంతమున జన్మించి యుండిరి. వీరి జన్మమునుగురించి తత్ప్రాంతవాసులనేక గాథలను జెప్పికొనుచుందురు. కాలాంతరమున భూమికవతరించిన భగవత్స్వరూపులని వారినమ్మిక. తదనుసారముగా నీమహాత్ములు బాల్యమునుండియు ననేకమహిమలు గనబరచుచుండెడివారట. గ్రంథవిస్తర భీతిచే నందునొకదానిని మాత్రమిట నుదహరించెదను. శ్రీపీరోజిదేశికేంద్రులు 8 సంవత్సరముల ప్రాయమున తమతల్లి యొద్ద గూర్చొనియుండగా తద్గ్రామవాస్తవ్యుడొక్కడా మార్గమున కొన్ని పశువులందోలుకొని

గోవుచుండగా నప్పుడీమహాను భావుడు తమ జననింగాంచి తల్లీ? యీ వైశ్యుని వెంట యమభటులుజనుచున్నారు. గాన యీతడచిర కాలంబుననే మరణించునని జెప్పగా తల్లి కసరి యీ బాలునినోరుమూసెనట. తదనంతర మాతడింటికేగి తన భార్యతోడంగలహించి తత్కారణంబున నురివేసికొని మరణించెనట. యిటులనెన్నియోకథలు తద్గ్రామ వాస్తవ్యులును, తచ్ఛాంతివాసులును జెప్పికొనుచుందురు. వీరిని తలిదండ్రులు 5 వ సంవత్సరమున స్వగ్రామమందలి పాఠశాలకుబంపగా తమధీబలమ్మున తోడి విద్యార్థులకన్న మిన్నగా విద్యనభ్యసించుచుండి యొకనాటి ప్రాతఃకాలంబున పాఠశాలనుండి యింటికి వచ్చుచుండగా శ్రీ చిదానందుండనునొక యోగీంద్రుడెదురురాగా భక్తివినయములతో నెదురేగి సాష్టాంగమాచరించి "మహాత్మా" భవబంధనివారకమగు నొక మార్గమ్ముంజూపింపుడని ప్రార్థింపగా నాయోగివర్యుండకారణ కారుణికత్వాజాయమానకటాక్షవీక్షణంబున తారక మంత్రోపదేశంబు జేసి యదృశ్యుండయ్యెను. తదనంతరము కొన్నినాళ్లవరకు స్వగ్రామమందలి పాఠశాలలోనే యాంధ్రభాష నభ్యసించి బడివిడిచిన వెంటనే అనగా 14, 15 సంవత్సరముల ప్రాయముననే తద్గ్రామ వాస్తవ్యులును శ్రీ సచ్చిదానంద స్వరూపులగు జమిలి శేషయార్యులయొద్దజేరి తద్గురు ప్రసాదమ్మునను, తమబుద్ధివిశేషంబునను, పరతత్వ రహస్యములనెల్ల గ్రహించి యనంతర మనేకశిష్యులను సమకూర్చి శివపంచాక్షరి ద్వాదశాక్షరి మొద

లగు పరమమంత్రముల నుపదేశించి వారిని తరింపజేసి క్రీ॥ శ॥ 1889 సం॥ ది 9 జులై మాసమునకు సరియగు విరోధి సం॥ ఆషాఢ శు ౧౧ మంగళవారంబున నశ్వరంబగు భౌతిక దేహంబును వీడి శాశ్వతంబగు బ్రహ్మైక్య మనుభవించుచియుండిరి. యిక్కవి వర్యులు, పరమానందసుధాలహరి, తత్వసంగ్రహము, స్వప్రకాశమానము, మొదలగు వేదాంత గ్రంధములను పన్నగాచలనాయక శతకము రామశతకము, మొదలుగాగల భక్తిరస ప్రధానములగు గ్రంధరాజములను రచించియుండిరి. వీనిలో పరమానంద సుధాలహరియను పొత్తము మాత్ర మచ్చుబడియున్నది. తదితర గ్రంధములు ధనాభావముచే ముద్రితములుగాని కొఅతను భాషాభిమానులగు మహాత్ములు దీర్చగలందులకు ప్రార్థితులు.

యిక వీరి కవితాశైలిని గురించియించుక వ్రాసి విరమించెదను. వీరికవిత్వమునందలి భావస్ఫూరకత్వము ధారాశుద్ధి సమాసఘట్టనము, చూచిన బమ్మెరపోతనార్యుని కవితాశైలికి దీటనవచ్చును. ఇందలి ప్రతిపద్యమును, భక్తిరసావేశకమైతన్మయత్వముగలిగించుచుండును. కొన్నిచోట్ల పండితైకవేద్యములగు కఠినపద భూయిష్టమును మఱికొన్ని తావులయందు పసిపాపలకేని దెలియదగిన సరళ పద గ్రథితమగు నిక్కవి సార్వభౌముని కవితాశైలింజూడ సీ॥ వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండరీతి నొక్కొక్కమాటు యను శ్రీనాధుని ప్రతిజ్ఞా వాక్యము స్ఫురించుచుండును.

శైలిం జూపుటకై యొకటి రెండు పద్యముల నిట నుదా
హరించెదను?

యిమ్మహనీయుని కవితారసాస్వాదన భారము రసిక లోకంబునకు వీడి యింతటితో విరమించుచున్నాడను.

ఇట్లు

జిల్లేపల్లి
ది 15-12-1924

సుజనవిధేయుడు,
బోడేపూడి వెంకటరావు.

మ॥ చారునీల పయోధరంబుల ♦ సౌరు గేరు శరీరముం
మారకోటి వికాసహాసుకు ♦ మారముం యసమానశృం
గారమోహనరూపముం గల ♦ కైటభాసురశిక్షు యిం
పాగగా గనుపించవే యిక ♦ పన్నగాచల నాయకా॥

మ॥ భద్రభద్ర కరాభ బాహుసు ♦ భద్రసోదర రుద్రవే
ధాద్రిజిదృషి పుంజ హృద్గత ♦ దైత్యభిత్యధి ఛిద్రభా
స్వద్రుచీధృత కౌస్తుభాంచిత ♦ సత్కృపైక సముద్ర సం
పద్రమాది సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥



ఓమ్.

# శ్రీ గురుపీఠిక.

సీ॥ శ్రీధరోంఘ్ర్యంబుజాం ♦ చిన్మరంద సుభృంగ
భృంగారవాగ్రని ♦ ర్భిన్నపూర్ణ
పూర్ణిమచంద్రికాం ♦ బోధీసుధాభాను
భానుకోటిప్రభా ♦ భాసమాన
మానసాంతర్వేది ♦ మధ్యతిల్పగహంస
హంసతూలిక తల్ప ♦ కానమోక
యోకాంతఖేల మో ♦ క్షేందిరైక్యాకార
కారణగురుమూర్తి ♦ సూరికల్ప

గీ॥ కల్పనాతీత పరనిర్వి ♦ కల్పముక్త
ముక్తసంగ సమస్తార్తి ♦ రిక్త సత్య
సత్యపురి మందిరాత్మ ని ♦ శ్చలద శేష
శేషగురురాజయోగి చి ♦ త్తోషభోగి.

సీ॥ ద్విదళప్రదేశ దే ♦ దీప్యసహస్రార
సారసాంతస్సార ♦ స్వప్రభావ
భావేతరాత్మ స ♦ ద్భావ సంభావితా
నందకందళిత ధ ♦ న్యద్వికాస
కాసారసంగమ ♦ కాంచన సౌధాంత
రంతరారామ త ♦ త్త్వైకరత్న
రత్నసింహాసనా ♦ గ్రాసీనగురుదేవ
దేవతా స్తవశార ♦ దీయచంద్ర

గీ॥ చంద్రికా సాంద్ర రేఖ వ ♦ చ్ఛాంతసంత
సాంతరంగన యుగపర ♦ సదయసత్య
సత్యపురి మందిరాత్మ ని ♦ శ్చలదశేష
శేషగురురాజయోగి చి • త్తోమభోగి. 2

సీ॥ దుర్భవాపార పా ♦ థోధిసముత్తార
తారకబ్రహ్మ వే ♦ దార్థసార
సారసనత్ఫుల్ల ♦ సత్పాగాత్మకృతి
నాకృతికావ్యయ ♦ సగుణమూర్తి
మూర్తిత్రయాత్మక ♦ ముక్తికాంతా వర
స్థావర జంగ మా ♦ ద్యఖిలలోక
లోకితసాక్షి ని ♦ ర్లోకా సహంకార
కారణతను మహా ♦ కారణాది

గీ॥ ఆదిమధ్యాంతలీన ద ♦ యాంతరంగ
రంగదకలంక దేశిక ♦ రాయ సత్య ॥సత్య॥ 3

సీ॥ ఏకోభవద్గురు ♦ మేకాంతలోకేశ
లోకేశ దృగ్మనో ♦ లోకనిత్య
నిత్యనిర్నిత్య ని • ర్ణాత్య ప్రత్యగభిన్న
భిన్నమాయాగుణ ♦ భేదృభేద
భవవిచ్ఛేద స ♦ న్మోద నిరింద్రియ
యింద్రియ చక్షుర్ని ♦ రీక్ష్యమాన
మానసపాణి వి ♦ జ్ఞాన దృగధిక్రమ
క్రమనిష్క్రి మవిహీన ♦ కల్మషహారి

గీ॥ హరిహరాంతప్రకాశ స ♦ ర్వాంతరాత్మ
ఆత్మలక్షిత బుధపాల ♦ నైకసత్య ॥సత్య॥ 4

సీ॥ దీక్షాప్రపన్నోక్త ప్ర ♦ త్యక్షదీక్షాధ్యక్ష
అక్షియుగాప రూ ♦ పాత్మలింగ
లింగాంగ చిదపాంగ ♦ మంగళోగిత సంగ
సంగభంగానంగ ♦ సాంగయోగ
యోగనిద్రామోఘ ♦ భోగధుర్యానురాగ
రాగరోగాగ సం ♦ త్యాగమార్గ
మార్గణానర్గళ ♦ భర్గషడ్వర్గ వి
సర్గసద్వర్గాప ♦ వర్గదాత
గీ॥ ధాతసంత్రాత సద్గుణ ♦ వ్రాతచేత
చేతనాతీత నిర్మల ♦ పూతసత్య ॥సత్య॥ 5

సీ॥ పరమపావనమైన ♦ గురుసాంప్రదాయంబు
విరచింపగా జాల ♦ వేడుకయ్యె
పరిపూర్ణకేవల ♦ బ్రహ్మైక్యనిష్ఠాగ
రిష్ఠస్వభావుడై ♦ సృష్టిలోను
యఖిలయోగములందు ♦ నతిగుహ్యమగురాజ
యోగమీలాగని ♦ బాగుమీర
గరిమ సాంఖ్యము దార ♦ కామనస్కంబులు
తత్త్వమస్యాదితా ♦ త్పర్యమెల్ల
గీ॥ సాంగముగదెల్పి సత్కృపా ♦ పాంగదృష్టి
తోడ రక్షించి కడతేర్చె ♦ తోరమెసగ

నట్టి గురుని పరంపరా ♦ ర్యక్రమంబు
తెలిసినంతయు వివరింతు ♦ తేటపడగ. 6

సీ॥ శ్రీరాజయోగ వి ♦ చారసంపత్ప్ర
పూర్ణబ్రహ్మ ప్రమో ♦ దార్ణవంబు
స్వాభావికాంచిత ♦ సచ్చిదానంద త
త్వాఖండ కేవలా ♦ ద్వైతైక్యఘనుడు
ఘనసుషుమ్నాగ్ర ప్ర ♦ కాశ స్వయంజ్యోతి
కాంతికలాప వి ♦ శ్రాంతిగురుడు
చిన్మయజ్ఞాత మ ♦ నోన్మన్యతీత జీ
వన్ముక్తినేత సం ♦ విన్మయుండు

గీ॥ సగుణనిర్గుణములుగాని ♦ సత్యధనుడు
నాదిమధ్యాంతములు లేని ♦ యాదిపురుషు
డార్యవంశాబ్ధి చంద్రుడై ♦ యలరునట్టి
యుపనిషద్బ్రహ్మ మనగ జె ♦ న్నొందె భువిని. 7

సీ॥ తదుపనిషద్బ్రహ్మ ♦ తత్స్వరూపకపూర్ణ
కరుణాకటాక్ష వీ ♦ క్షణయుతుండు
మహదహంకార త ♦ న్మాత్రవిలక్షణా
తీంద్రియాత్మకుడు ని ♦ రింద్రియుండు
త్రిగుణవిధ్వంసి దే ♦ దీప్యశశ్వదఖండ
పరతత్త్వసార సా ♦ ఖ్యరతవిభుడు
నిగమపురాణోప ♦ నిషదంత చింతనా
వ్యయ సుధాస్వాదుసా ♦ నైకహృదయ

గీ॥ శాంతమూర్తి మనోజయా ♦ నంతకీర్తి
శ్రీకరుండు ద్వితీయ దే ♦ శికవిభుండు
గురుకులాంభో నిధికి సుధా ♦ కరుడునైన
రంగరాజాఖ్య గురుడు జె ♦ లంగె భువిని. 8

సీ॥ ఆరంగరాజ స ♦ దాచార్య కరుణా క
టాక్ష వీక్షణయుక్తు ♦ డాత్మవిదుడు
సర్వదాత్యక్త వా ♦ సనమాన నిష్ఠాగ
రిష్ఠనిర్మాణ సం ♦ తుష్టియుతుడు
వాక్యచతుస్సార ♦ వాహసౌఖ్యాప రో
క్షాద్వితీయ స్వప ♦ కాశమయుడు
కరణనిగ్రహ నిరా ♦ కాశ నిశ్శబ్ద బ్ర
హ్మైక్యరసా స్వాది ♦ తామనస్కు
గీ॥ డవ్యయాశేష పరశర్వ ♦ దచలపూర్ణ
శ్రీమదాత్మ తృతీయ దే ♦ శికవిభుండు
నైన చిట్టిముశెట్టి వం ♦ శాబ్ధిచంద్రు
డనగ లక్ష్మయనామ స ♦ దార్యుడలరె. 9

సీ॥ ఆలక్ష్మణార్య న ♦ త్యనుకంపసదపాంగ
వీక్షణాలంకృత ♦ విమలచరిత
డవ్యక్తుడవ్యయు ♦ డప్రమేయుడనాద్య
డకలంక డక్షరు ♦ డ ద్వితీయు
డ గుణుడసంగుడ ♦ నాకారుడద్వయు
డవిషయు డమలిను ♦ డప్రతర్క్య

డగుపరబ్రహ్మ చ ♦ లైక్య సుఖానంద
పూర్ణుడుసదను కం ♦ పార్ణవుండు
గీ॥ శ్రీమదాత్మ చతుర్థ దే ♦ శిక విభుండు
నగు జమిలివంశ సాగరా ♦ బ్జాంగమైన
శేషగురువర్యు వెలమి భా ♦ సిల్లె భువిని
తద్గురు ప్రభువరు సాంప్ర ♦ దాయమిదియు. 10

సీ॥ ఆసదాచార్య శి ♦ ఖావతంసుసుమాను
త్రిగుణాత్మక ప్రాకృ ♦ తిని హరించి
యరిషడ్గుణంబుల ♦ నంటనీక మనో వి
కారంబులన్ని ని ♦ ర్గతము జేసి
పరమగోప్యంబైన ♦ పరమాత్మతత్వ మి
ట్లనికటాక్షించి భ ♦ యంబుబాపి
మముకృతార్థులజేసి ♦ మాయావిదూరుడై
సదమలరౌద్రి వ ♦ త్సరమునందు
గీ॥ పరగశ్రావణ మందున ♦ బహుళశదియు
భానువాసరయుక్త శు ♦ భ ప్రదంపు
దివసమందున బ్రహ్మైక్య ♦ ధీరుడయ్యె
శ్రీమదాత్మానుభవుడు శ్రీ ♦ శేషగురుడు. 11

సీ॥ కుంద మాలత్యార ♦ విందవకుళోత్పల
మల్లిక హింజుల ♦ మహితతులసి
దళపుష్పచయముల ♦ తద్గురుపాదప
ద్మంబు లర్చించియు ♦ తాల్మిమీర

చందన నాగరుఘన ♦ సార కస్తూరికా
న్వితయక్షకర్దమా ♦ క్షతలతోడ
ధూపనైవేద్యప్ర ♦ దీప దధిక్షీర
ఘృతమధు శర్కరాం ♦ చిత ఫలములు
గీ॥ దక్షిణలతోడ గురుకులా ♦ ధ్యక్షయతికి
విమల కర్పూర తాంబూల ♦ వితతితోడ
చెలగి యర్పించి నిర్మల ♦ శేషమంది
పంచుకొని మెక్కరయ్య ♦ సద్భక్తులార 12

సీ॥ శ్రీశేషగురునకు ♦ శిష్యుడనగుపీరు
దాసు డనే హరి ♦ దాసులకును
దాసుడ బుధజన ♦ తాపవిధ్వంసన
ధ్యావు శ్రీవనమాలి ♦ భక్తియుతుడ
నై గురుపీఠిక ♦ నత్యంతభక్తితో
వర్ణించితిలను దు ♦ ర్వారమహిమ
జదివిన వ్రాసిన ♦ శ్రద్ధతో విన్నను
జనులకు నిష్టార్థ ♦ సంపదలును
గీ॥ వృద్ధిగల్లును మోక్షార్థ ♦ సిద్ధిగల్గు
గానవాచంద్ర తారార్క ♦ మైనటించు
చల్లనగు దయమమ్మెలు ♦ మెల్లయెడల
యార్త జనపోషరామ భ ♦ ద్రాద్రిరామ 13

శ్రీ గురుపీఠిక సంపూర్ణం

---

ఓం.

శ్రీసద్గురవే నమః.

# పన్నగాచల నాయక శతకము.



మత్తకోకిల.

శ్రీరమారమణీ మనోహర ♦ చిన్మయాత్మక పాండుర
స్మేర శోభితరాజమండల ♦ స్నిగ్ధసద్వద నాంబుజా
వారిజాసన సోమశేఖర ♦ వందితాంఘ్రి సరోరుహా
పాం మోక్ష శుభప్రదాయక ♦ పన్నగాచలనాయకా 1

మ॥ పంకజాయత సత్కృపోద్యద ♦ పాంగశోభితలోచనా
వేంకటేశ్వర భక్తవత్సల ♦ వేదతత్వవిచారణా
సంకటౌఘతమోవిదారక ♦ సత్ప్రకాశిత భాస్కరా
పంకజోదర భాగ్యదాయక ♦ పన్నగాచల నాయకా 2

మ॥ మండదండజరాజవాహన ♦ మారకోటి సుమోహనా
జాండభాండసమస్తపోషణ ♦ చారుమౌక్తిక భూషణో
ద్దండభండన ఘోరభీషణ ♦ దానవాంబుధిశోషణా
పండితావన భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 3

మ॥ శ్రేయసీయలివేలుమంగ వ ♦ శీకరా శ్రితపోషణా
త్మీయ మాయావికారభంజన ♦ ధీరమానసరంజనా
మేయతోయదకీలవాహన ♦ మేద్ధ విక్రమసాహసా
పాయసాయిత మోక్షదాయక ♦ పన్నగాచలనాయకా 4

మ॥ దీనమానసవీధిఖేలన ♦ దివ్యసంయమి పాలనా
జ్ఞానలీన స్వయం ప్రకాశక ♦ సాధుచిత్త నివేశకా
ధ్యానమాన నిధానరూపక ♦ తత్వకాంతికలాపకా
జ్ఞానదానఘ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 5

మ॥ అంబుజాంబక దేవదేవక ♦ దంబపోషణశీలపీ
తాంబరాంబర నిమ్నగాదిప♦దాంబుజద్వయ కారణా
జాంబిక ప్రియవంద్యభక్తజ ♦ నౌఘకల్ప మహీజభూ
పాంబుజోదర భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 6

మ॥ సారసారితుషారశారద ♦ చంద్రికా ఘనసారమం
దారహార సుధాంబుధీ రజ ♦ తావనీధర హీరపా
కారివారణ తుల్యసర్వది ♦ గంతపూర్ణయశోజ్వలా
పారవీర విశేషసాయక ♦ పన్నగాచల నాయకా 7

మ॥ కాలకాల ధనుస్త్రుటిత్తిల ♦ కాంచితోన్మృగనాభిస
త్ఫాలకూలదశాస్య భంజన♦ పాపవారిధరౌఘవా
తూల నీలపయోధరద్యుతి ♦ తుల్యదేహ మహానుకం
పాలవాల సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా

మ॥ గోపభూపయశోదబాలక ♦ గోపికాలి మనోహరో
ద్దీపరూపవికుంఠమందిర ♦ దివ్యశక్తి సమస్తలో
కావరూపమయూరపింఛ వి ♦ కాస కంసవిరోధిని
ష్పాపశ్రీపతి మోక్షదాయక ♦ పన్నగాచలనాయకా 9

మ॥ కామకోమల దేహమండిత ♦ కామితార్థ ఫలైకచిం
తామణీ మధుసూదనా వ్యయ ♦ తత్వరూప నిశాటసం
గ్రామ భీమ విశాలకాల వి ♦ కాసవహ్ని శిఖాభకో
పామితామల భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 10

మ॥ యాగయోగఫలాదికారణ ♦ యక్షగాన వినోద సం
భోగసాగరకన్యమానస ♦ పూర్ణకామ లసద్దయా
సాగరాగమశాస్త్రవాక్య ర ♦ సార్ధసార పరాత్మ స
ద్భాగధేయ శుభప్రదాయక ♦ పన్నగాచలనాయకా 11

మ॥ నాకలోకదివౌకసాదిస ♦ నాథ మాధవ సద్గుణా
నీక రాకసుధాఘృణీ నవ ♦ నీతసద్విమలాననా
స్తోకభీకరదానవద్విష ♦ తోయజాంబక స్వస్వరూ
పా కళాకర భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 12

మ॥ భూతనేతవధూ స్తవాహ్వయ ♦ భూరివైభవదాత కం
జాతజాతసదావనాస్పద ♦ జన్మపుంజవిఘాత ని
ర్నేత శీతకరార్కలోచన ♦ నిత్య నిర్మల పూత ని
ష్పాతకా తత భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 13

మ॥ మేదినీదివిసర్వలోక స ♦ మీరవహ్నిజలాదిభూ
తాధినాధ యజాండ గర్భని ♦ తాంతగర్వితభూధర
ప్రోదినీ దితిసంభవౌఘ మ ♦ హోహవాంగణభేది భూ
పా దివేది శుభప్రదాయక ♦ పన్నగాచల నాయకా 14

మ॥ వాదభేద వికారదోషని ♦ వారణైక విషాదవి
చ్ఛేద వేదపురాణశాస్త్ర వి ♦ శేష తత్వవిభేద ప్ర
హ్లాద మోద ముకుంద దివ్య వి ♦ లాస దానవినోదసం
పాద శ్రీదసుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 15

మ॥ జానకీనవమోహనా సద్వ ♦ శామలాత్మపధాను సం
ధాన సూనశరాతికోమల ♦ తత్త్వబోధనిధాన ప్ర
జ్ఞాన దీనశరణ్యపన్నగ ♦ శాయిసంవిదఖండ చి
ద్భాను భానుసహస్రదీపక ♦ పన్నగాచలనాయకా॥ 16

మ॥ ద్వేషభీషణవేష సాత్వవ ♦ తేజుహృత్పరిపోషణా
శేష శేషఫణీంద్రశాయి వి ♦ శేషశీక్షర ఘోష దు
ర్దోషశోష మహాసుధారస ♦ తుల్యమంజులమాధురీ
భాషభూషణ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 17

మ॥ దేవదేవ త్రిలోకపాల న ♦ ధీ జనావనతన్మహా
దేవసేవిత పాదమేరు ధృ ♦ తీభవాంబుధినావ యిం
దీవరావనిభృద్విలాస స ♦ ద్భక్తరక్షక ప్రభావ లస
ద్భావ కేవలమోక్షదాయక ♦ పన్నగాచలనాయకా॥ 18

మ॥ శ్యామకోమలమూర్తినిత్య ని ♦ రామయాత్మచిదంతరా
రామ తామరసాసనస్తవ ♦ రాక్షసాంతక భీమ స
త్కామ సామజరాజకష్టవి ♦ దార పావననామ భూ
పామహామహాదర్పదాయక ♦ పన్నగాచలనాయకా॥ 19

మ॥ శ్రీశ కేశవ భక్తవత్సల ♦ చిన్మయాత్మ పరేశ దో
షాశపాశవిదూరసాధు మ ♦ నోరవిందనివేశ నా
కాశ కేశవిధి సహాహ్వాయ ♦ కంబుకంధర మేశ ని
ష్పాశ క్లేశ విశేషనాశక ♦ పన్నగాచలనాయకా॥ 20

మ॥ రాజరాజ విరాజపూజిత ♦ రాజబింబ నిభాన నాం
భోజ తేజవిశాల లోచన ♦ భూజనాశ్రయ రాజ ని
ర్వ్యాజభూజమనోజ్ఞభృంగయి ♦ నాన్వయాంబుధిరాజ భూ
పాదరాజితపూజి నాయక ♦ పన్నగాచలనాయకా॥ 21

మ॥ రేఖ మేఘరుచి ప్రవాహక ♦ కీర్తితిగ్మరుచిరేఖ చి
త్రేఖ రేఖర కౌస్తుభాఢ్యము ♦ కీచకోద్యద మోఘ స
న్మేఖలా ఘటనావలగ్న ర ♦ మేశ హేమమయూఖ శో
భాఖచి ఖరశోషనాయక ♦ పన్నగాచలనాయకా॥ 22

మ॥ శోభితాభరణాంచదంగ య ♦ శోధిగ త్వముకుంద స
ల్లాభ నైభవ శ్యామవర్ణ వి ♦ దారితార్తిప యోభవక్
క్షోభితేభ రమైకమాన స ♦ చోర నీరజనాభ సం
ప్రాభవాభయ మోక్షదాయక ♦ పన్నగాచలనాయకా॥ 23

మ॥ దానభాస దఖండసౌఖ్య ప ♦ దప్రదానవిలాస కై
లాసవాస ధనుర్వినాశ కు ♦ లాద్రిధారిదయాక రో
ల్లాసకేసరి రాజరాడ వ ♦ లగ్నలోకనివాస భూ
పాసదాసమ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 24

మ॥ ద్రోహమోహావికార భంజన ♦ దుష్టనాటవిదాహని
ద్రోహ దేహావ్యామిషీకలక్ష్య ద ♦ తీవ్రదియాత్మస్నేహ హం
సాహ మోహావిగోచరా హ ♦ సిగ్ధమోక్షసదాహ సం
భాహవాహావఘోరసాయక ♦ పన్నగాచలనాయకా॥ 25

మ॥ కోటికోటి తటిద్విలాస త్రి ♦ కూటభాగలలాట న్యం
గాటికాటదఖండ చిన్మయ ♦ కైటభారివిశాల మా
యాటకాటకివ శత్రేవ స ♦ ంకటకోట్యుపఘోటి గో
పాటపాటలిగంధదీపన ♦ పన్నగాచలనాయకా॥ 26

మ॥ సంచరీచరమార్గ వైఖరీ ♦ ప్రాంచకిల్బిషమోచ మా
రీచమీచన్యాగసిద్ధిహాని మా ♦ రీచిశైలనికాచ స
ద్గోచరాచలశశ్వదాత్మ సు ♦ గోప్యదివ్యమనోజ రూ
పాచరాచరలోక నాయక ♦ పన్నగాచలనాయకా॥ 27

మ॥ నాధనాధ సరోజపాదయు ♦ నాధబాధవిరోధ ధా
గాధరాధిక కృష్ణవర్ణ వి ♦ రాధశోధన సాధు సే
వ్యాధరాధరధారి వేధశి ♦ వాధవాప్తిబోధ దీ
పాధరాధవ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 28

మ॥ కంజరంజన దీర్ఘనేత్రయు ♦ గ్మైక పండితబృంద హృ
త్కంజరంజితకంజబాంధవ ♦ కంజనాభ విపల్లతా
కుంజపుంజత్రుటల్ల విత్రిక ♦ కుంజరస్తుత దైత్యరా
డ్వ్యంజనాంజన మోక్షదాయక ♦ పన్నగాచలనాయకా॥ 29

మ॥ సంతతాంతర బాహ్యదీపక ♦ సార్వభౌమ మహాంత వే
దాంతచింతనసూరిపాల ని ♦ తాంతనిర్మలస్వాంత వి
శ్రాంతి దాంత నిరంజనా వ్యయ ♦ శాంత సత్వ నిరంత ని
ర్భ్రాంతి సాంత సుమోక్షదాయక ♦ పన్నగాచలనాయకా

మ॥ చింతతంతువిరామ సద్గుణ ♦ శేముషీవర కాంత శ్రీ
కాంతకాంత సహస్రకోమల ♦ కౌస్తుభోజ్జ్వలకాంతి స
ర్వాంత సంతప సంప్రసాదక ♦ వైరిసంతతిహాంత ద్వీ
పాంతరాంత సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 36

మ॥ చిత్రచిత్రమహాప్రభావ వి ♦ శేష భక్తపవిత్ర చా
రిత్ర మిత్రకులాబ్ధిచంద్ర ధ ♦ రిత్రిపుత్రికళత్ర గా
యత్రి సూత్రర ప్రదీప వ ♦ హా త్రినేత్రసుమిత్ర స
త్పాత్ర గోత్రధరేశ నాయక ♦ పన్నగాచలనాయకా॥ 37

మ॥ దివ్యకావ్యరసానుకూల బు ♦ ధేంద్రసేవ్యచరవ్య క
ర్తవ్య నవ్యతరావ్యయా ద్వయ ♦ తత్వరూప రసవ్య భూ
భవ్యపావ్య సుభావ్య కవ్య వి ♦ పక్షసద్వినుతవ్య సం
భావ్యదివ్య సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 38

మ॥ చంద్రచంద్రిక సాంద్రరేఖయ ♦ శక్రపభాసదుపేంద్ర మా
నీంద్రచంద్ర ధరేంద్రపూజిత ♦ నిశ్చలాత్మ నిరింద్రియా
యింద్రియేంద్రరిపుప్రహార న♦ రేంద్రచంద్ర మహేంద్రభూ
పేంద్ర వారణభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 39

మ॥ భద్రభద్రకరాభబాహు సు ♦ భద్రసోదర రుద్రవే
ధాదిజిద్మషిపుంజ హృద్గత ♦ దైత్యభిత్త్యధిభిద్ర భా
స్వద్రుచీ ధృతకౌస్తుభాంచిత ♦ సత్కృపైకసముద్ర సం
పద్రసాద్రి సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 40

మ॥ అర్కరాజవిశాలనేత్ర సు ♦ ధాబ్ధితల్ప జనార్దనా
తర్కవాద విభేదభంజన ♦ తత్వరూప నిరంజనా
మర్కటోత్తమ బృందసేవిత ♦ మండలేశ కటాక్షసం
పర్కశాశ్వత భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 41

మ॥ ఖండకాండశరాసనాంచిత ♦ చారుసద్భుజదండ వే
దండమండనపాలశీల స ♦ దండజధ్వజమండితో
ద్దండఖండన వీరనిశ్చల ♦ దైత్యభేది యజాండరా
ట్పుండితావన భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 42

మ॥ పద్మబాంధవ వంశసాగర ♦ పద్మవైరి నవస్ఫుర
త్పద్మలోచన పద్మవల్లభ ♦ పద్మనాభ దయానిధే
పద్మగర్భశివాదిపూజిత ♦ పద్మపాదసుధీమనః
పద్మసద్మసుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 43

మ॥ దుర్గసన్నుతనామ పల్లవ ♦ తుల్యపాదసరోజ ష
డ్వర్గనిర్గత దైత్యభేద్య ప ♦ వర్గనాధశిరోమణీ
స్వర్గరాజ్యసదావనాకర ♦ స్వర్ణభూధరధీర త
ద్భర్గమిత్ర సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 44

మ॥ శక్రనీలపయోధరాంగ శ ♦ శాక్రకుండల వక్త్రని
ర్వక్రవిక్రమ శక్రవందిత ♦ వారణోత్తము పాలనా
నక్రశోషిత చక్రహస్తక ♦ వద్గదాధర శౌరి భూ
పక్రతుక్రియ హేతుదీపక ♦ పన్నగాచలనాయకా॥ 45

మ॥ కర్ణయుగ్మ సువర్ణరత్న వి ♦ కాసకుండల రేఖ వి
స్ఫూర్ణపన్మణి వజ్రకీలిత ♦ భూరి తేజకిరీట ము
స్వార్ణవాంతరశాయి పద్మభ ♦ వాండగర్భ మహానుకం
పార్ణవోజ్వల భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 46

మ॥ దుగ్ధవార్ణవనావ దుర్గశ ♦ దూరగ పీగ పునఃపునా
విర్భవోజ్వల దుష్టనిగ్రహ ♦ విశిష్టశిష్టదనుగ్రహా
నిర్భగాద్వయ కేవలాత్మక ♦ నిర్భయోక్ష నృసింహ సూ
పార్భకార్చిత భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 47

మ॥ అభ్రికేశ విధుస్తవాహ్వయ ♦ హాటకాంబరధారిమ
ధ్యాభ్రిగాన్వయరాట్తురంగ శం ♦ ఘాంగ వేంకటనాథ స
చ్ఛుభ్రిభాను గుచిప్రభాస యా ♦ శోదిగంత త్రిలోక భూ
షాభ్రవాహ సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 48

మ॥ సప్తసాగర సంచరద్వ్రాల ♦ స్వత్ప్రకాశ జగజ్జగ
ద్గుప్తరూప మురాసురద్విష ♦ కుందకుట్మలదంత సం
తప్తహేమ మణిప్రభాసము ♦ దంచితాభరణౌఘ సం
ప్రాప్తసౌఖ్య సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 49

మ॥ సప్తకీల శిఖాసదృగ్వ్రల ♦ సత్ప్రకాండ శరాసనో
ద్దీప్తమాన విరోధభంజన ♦ దేవమందరగోత్ర ప్రో
క్షిప్త భక్తజనాప్త సత్తుల ♦ సీదళాన్వితదామ సం
ప్రాప్త దివ్యఫలప్రదాయక ♦ పన్నగాచలనాయకా 50

మ॥ అగ్నినేత్రసఖాంబరీషగు ♦ ణాఢ్య పాలనశీల కా
లాగ్నికీల సమాన రోషమయ ♦ ఘోఘకాసన ఘోరదా
వాగ్ని కైటభ దానవాంతక ♦ వారిజోదర దుర్గ్రహో
ద్భగ్న సౌఖ్యసుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 51

మ॥ భక్తవత్సల కర్మపాశవి ♦ భక్త సద్భవదంఘ్రి సం
సిక్తచేతన యుక్తరంజన ♦ శ్రీరమారమణేశ స
న్మౌక్తరూప సమస్తపావి ♦ ముక్తి శశ్వదఖండ స
ద్భక్తలోల సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 52

మ॥ రత్నసానుసమానధీర వి ♦ రాధశోధన సూత్రిస
ద్రత్నకీలిత హేమధామ స్ఫు ♦ రత్కిరీట విరాట్ఛిరో
రత్న సూనృతమంజుభాషణ ♦ రావణాంతక భార్గవీ
పత్నిలాంఛన భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 53

మ॥ రాజమండల సన్నిభాసన ♦ రాజరాజవతంస భూ
రాజమండల ముఖ్యపూజిత ♦ రాజయోగిమనోజ్వలా
రాజశేఖరవంద్య సన్మృగ ♦ రాజరాజితమధ్య భూ
పాజిభీషణ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 54

మ॥ సింధురేంద్రశరణ్య భక్తవ ♦ శీకరామృత సద్దయా
సింధు సైంధవరామకామ వి ♦ శేషసన్మృదులాకృతీ
సింధుబంధన సూరిచందన ♦ సింధుతల్ప మహావిప
ద్బంధఖండన భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 55

మ॥ ఉన్మనీసువిలాసపూర్ణ మ ♦ నోన్మనీయుతభాసురా
చిన్మయాత్మ స్వయంప్రకాశ య ♦ చింత్య నిర్మలతత్వ సం
విస్మయాచల సార్వభౌమ క ♦ వీంద్రమానసకంజశుం
భన్మనోహర భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 56

మ॥ సర్వతోముఖ సర్వరూపక ♦ సర్వదీపకలాపకా
సర్వపాలన సర్వఖేలన ♦ సర్వలోక విచారణా
సర్వకారణ సర్వధారిణ ♦ సర్వకార్యధురంధరా
సర్వతోద్ధర భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 57

మ॥ హల్యశాపవిముక్తి శశ్వద ♦ హర్మ్యశైలనివాస కా
సల్యతోషరస ప్రవర్ధన ♦ సప్రసాద పరాత్మ సా
కల్యభావ సమస్తరా ద్దశ ♦ కంఠజి న్మమజన్మసా
ఫల్యకారణ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 58

మ॥ ఆర్యకార్యఫలప్రసిద్ధి మ ♦ హాత్మచార సుధైక మా
ధుర్యధుర్యసుఖైకవాక్య వి ♦ దోష తోషకర స్వయం
తుర్యధుర్య నిరంజనా వ్యయ ♦ దోర్బలాఢ్య పరార్థతా
త్పర్య ధీరసుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 59

మ॥ విశ్వరూపక విశ్వపాలక ♦ విశ్వమోహన విశ్వసృ
డ్విశ్వపాలన విశ్వజీవన ♦ విశ్వకర్త పరాత్పరా
విశ్వనాటక శశ్వదాత్మక ♦ విశ్వగర్భ విహంగభూ
పాశ్వ శాశ్వత భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 60

మ॥ వందనంబిదె వేంకటేశ్వర ♦ వైభవ ప్రకరేశ్వరా
డెందమందలరిన్ వసింపుము ♦ తీవిబూని ముకుంద గో
వింద నీచరణారవిందము ♦ వేఁడెదీయెడ కోర్కెలిం
పండఁజేయుము జాగుసేయక ♦ పన్నగాచలనాయకా॥ 61

మ॥ తల్లిఁదండ్రివి నీవెమాకును ♦ దాతదైవమునీవె మా
కెల్లకాల మభీష్టభాగ్యము ♦ లిచ్చుమాయిల వేల్పువే
కల్లగాదు ముకుందమాకును ♦ కల్పవల్లివిగాన మీ
పల్లవాంఘ్రులుగొల్తుఁబాయక ♦ పన్నగాచలనాయకా॥ 62

మ॥ అన్యులెందరినైనఁగోరను ♦ పాశ్రయించిన నేమిరా
జన్యమాన్యుఁడవీవుమాకు ప్ర ♦ సన్నమైకరుణించి సౌ
జన్యసౌఖ్యములీయరా కడు ♦ జాలమేటికి సర్వరూ
పాన్యశోభిత భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 63

మ॥ తప్పులేమియెఱుంగరా భవ ♦ దంఘ్రులేఁ నెరనమ్మితిన్
తప్పులెన్నకఁ బ్రోవవే పర ♦ దైవ నీతనయుండనో
యప్పనీకృపగల్గి నంతన ♦ నంతసౌఖ్యశుభాధికం
బప్పుడేసమకూడుబాయక ♦ పన్నగాచలనాయకా॥ 64

మ॥ నీదుసత్కరుణా కటాక్షము ♦ నించుకేనియు లేక మో
హాదదర్ప గడువంగ శక్యమె ♦ యుర్వి నెంతటివారికిన్
నీదయారస భాగ్యముంగన ♦ నేదలంచెద నయ్య నీ
పాదపద్మయుగంబు బాయక ♦ పన్నగాచలనాయకా॥ 65

మ॥ ఎంతగానిను నమ్మి వేడిన ♦ నేల నీదయ గాదు మీ
చెంత జేరినవారలన్యుల ♦ చెంత గోరుటన్యాయమా
యింతమాత్రపుధర్మమానస ♦ మేలబుట్టను నాపయిన్
వంత మేలర భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 66

మ॥ మీకులోకిదయానిర్దయామతి ♦ మించిగాంచిన దాతలిం
కేరి నన్నెవ రాదరింతురు ♦ నీవెగాక భరింపనె
వ్వారు లేరు చరాచరౌఘుని ♦ వాస బ్రోవుము సద్దయా
పారిదృష్టిని జాగుసేయక ♦ పన్నగాచలనాయకా॥ 67

మ॥ దండిభూమివి భుండవంచును ♦ దండ జేరినవాడ న
త్పండితావన నీదయాపద ♦ పొంగదర్శన మెప్పుడో
మండలేశ్వర సర్వకాలము ♦ మమ్ముబ్రోవగదయ్య భూ
మండజధ్వజ భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 68

మ॥ నీపదాంబుజ యుగ్మముం గమ ♦ నీయ నిశ్చలభక్తితో
రేపుమాపు మనంబులోన స్మ ♦ రించు వారలకెల్ల సం
తాప పాపనివారణంబగు ♦ దంతిపుంగవపాల నీ
ప్రాపుదాపగు భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 69

మ॥ నీవె సర్వచరాచరంబులు ♦ నీవె సర్వజగంబులున్
నీవె మానవతిర్యగాదులు ♦ నీవె సప్తసముద్రముల్
నీవె గాకితరంబులేదని ♦ నిర్ణయించి భజించితిన్
భావమందున నిన్నుబాయక ♦ పన్నగాచలనాయకా 70

మ॥ దేవ నీకృపయెట్టిదో గను ♦ తింప శక్యముగాదు నీ
సేవకుల్ బహు ద్రవ్యయుక్తుల ♦ చేతఁజేరి యుజ్ఞసముల్
సేవ వృత్తులలోన నుండగ ♦ జేసితే యిదిగొప్పయా
భావమండన భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 71

మ॥ ఎంతసిర్దయ మానసుండవు ♦ యేవిధంబున నిన్ను సే
వింతు మజ్జగదంబ యాయలి ♦ వేలుమంగయు గూడ నీ
చెంతనుండ సహింపదే మరి ♦ చేరువందునఁజేర్చ నీ
పంతమేమి సుభద్రదాయక ♦ పన్నగాచలనాయకా 72

మ॥ దాసులన్ దయ బ్రోవలేకను ♦ ధారుణీజనులందు నీ
వాసబెట్టుక వారిచేగొను ♦ వడ్డికాసులచేతనే
గ్రాసమున్ దినుచున్నవాడవు ♦ గానిమమ్ముల బ్రోవవో
భాసమానవిలాస రమ్మిక ♦ పన్నగాచలనాయకా 73

మ॥ ఎల్లకాలము నీవె దీనుల ♦ నేలునట్టి విభుండవై
యుల్లసిల్లుదటంచు శాస్త్రవి ♦ ధోక్తులన్ దగవింటి నా
యుల్లమం దెడబాయ కెప్పుడు ♦ నోపికన్ నినుగొల్తు నీ
పల్లవాంఘ్రులు జూపవాయిక ♦ పన్నగాచలనాయకా 74

మ॥ ఎట్టిదో హరి నీమనంబిటు ♦ లెంతవేడినగాని యే
మట్టుకున్ బెనుపట్టుగా నను ♦ మాత్రమైన గనుంగ దీ
పట్టునే విడనాడకుండిన ♦ పాడిగాదిక నన్ను చే
పట్టుకొమ్ము శుభప్రదాయక ♦ పన్నగాచలనాయకా 75

మ॥ ఎక్కువైన విభుండవై ధర ♦ నెల్లభక్తజనాళి నీ
వక్కజంబుగ నెల్లకాలము ♦ నాపదల్ విదళించి బల్
చక్కగా దయమీరనేలెదు ♦ స్వామినిన్ విడనాడి నే
బక్కవేల్పుల గొల్తునాయిక ♦ పన్నగాచలనాయకా 76

మ॥ ఇంతగా నిను వేడినందుక ♦ దేల నీదయ రాదు ర
వ్వంతయైనను నాపయిన్ మధు ♦ వైరి నాహృదయంబులో
చింతజేయుదు శ్రీహరీ దయ ♦ చేయరా తడవేలరా
పంతగించిన నోర్తునాయిక ♦ పన్నగాచలనాయకా 77

మ॥ నిన్ను సన్నుతిజేయువారల ♦ నేరముల్ క్షమియించవా
పన్నరక్షణనాదుదీనత ♦ బాపవా కరుణించవా
యెన్నరుంగక జేసినన్ నెప ♦ మెన్నకన్ ననుబ్రోవరా
పన్నగావినుతింతుబాయక ♦ పన్నగాచలనాయకా॥ 78

మ॥ నేరమేమి యొనర్చినాడను ♦ నీరజోదర నీపదాం
భోరుహంబులు బట్టినాడను ♦ బ్రోవక విడనాడెదో
శౌరిమన్మనసాబ్జమందని ♦ శంబుస్థాపనజేతు నా
భారమంతయు నీదిరాయిక ♦ పన్నగాచలనాయకా॥ 79

మ॥ మేదినీదయ జూపరా చల ♦ మేలరా కరుణించు నీ
పాదముల్ నెరనమ్మితిన్ పొర ♦ పాటు సేయుగబోకురా
సాదరంబుగ మమ్ము నేలెడు ♦ స్వామివీవని నామదిన్
పాదుగా నిడుకొందు బాయక ♦ పన్నగాచలనాయకా॥ 80

మ॥ పన్నగాధిప శాయినీపద ♦ పద్మముల్ మదిలోపలన్
సన్నుతింతురు నీ వెదిక్కని ♦ సర్వకాలము ధీయుతుల్
వన్నెకెక్కినదండి భూపతి ♦ వంచు నిన్ను భజింతు నా
పన్నులన్ దయబ్రోవుమీ యిక ♦ పన్నగాచలనాయకా॥ 81

మ॥ నిన్నుగాక మరెవ్వరిన్ కరు ♦ ణించి బ్రోవుమటంచు నే
నెన్నడైననుగాని వారల ♦ నెంచి స్తోత్రము జేయ నా
పన్నరక్షక నీటముంచిన ♦ పాలముంచిన నీవె సం
పన్నమూర్తి శుభప్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 82

మ॥ సారసోదర నీస్వరూపము ♦ సన్నుతించినవారి దు
ర్వార ఘోరభవవ్రజంబు ని ♦ వారణంబగునంత చి
త్త్వాంచితంబగు మోక్షసౌఖ్యము ♦ పొందుచుందురు శాశ్వతా
పాపనిర్మల భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 83

మ॥ ఆదిమూలవిరాట్టువై యఖి ♦ లాండకోటి యజాండముల్
పాదుగా సృజియించి నాడవు ♦ భారమేమియు లేక నే
వేదవేద్యసమస్తకారణ ♦ వేంకటేశ్వరకీర్తి సం
పాదిశాశ్వత భద్రదాయక ♦ పన్నగాచలనాయకా॥ 84

మ॥ ఒక్కరీతిని సంచరించక ♦ నుత్తమోత్తమనీవు పెఁ
దిక్కుదిక్కుల బిక్కటిల్లుచు ♦ దీప్తిచేత వెలుంగు ని
న్నెక్కడంచు భజింతు నీకియ ♦ లెట్టివో గనజాల పెం
పక్కజంబుగ గొల్తు బాయక ♦ పన్నగాచలనాయకా॥ 85

మ॥ ఏలరాతడ వేల రాచల ♦ మేలరాయిక నాయెడఁ
ఫాలలోచనవంద్య నీపద ♦ పంకజంబులునమ్మి నీ
మ్రోలనిల్చియజస్రముఁ మరి ♦ మ్రొక్కిసన్నుతి జేతు భూ
పాలిదేవ సుభద్రిదాయక ♦ పన్నగాచలనాయకా॥ 86

మ॥ ఇమ్ముగాభవదీయభక్తికి ♦ నేదియుఁ సరిగాదురా
తమ్మికంటి మహాప్రభోదయ ♦ దాచకఁనను బ్రోవరా
నమ్మివేడిన వారలఁ విడ ♦ నాడుటేలొకో నీదురూ
పమ్ము నాకును జూపరాయిక ♦ పన్నగాచలనాయకా॥ 87

మ॥ ఏకమై పరిపూర్ణమై సక ♦ లేంద్రియ ప్రకరాంత మ
స్తోకమై నిరవద్యమై కడు ♦ సూక్ష్మమై మొదలేక ని
ర్వ్యాకులంబకలంకమై యప ♦ వర్గమైన పరాత్మ రూ
పాకరంబగు భద్రదాయక ♦ పన్నగాచలనాయకా 88

మ॥ రెండురేకుల తమ్మిపైపది ♦ రెండురేకులు జేర్చి యా
రెండు ద్రోసియు రెండుబాసియు ♦ రెండుడాసియు రెంటిపై
రెండునొక్కటిజేసి వేరొక ♦ రెండు నొండును లేక నే
పండియుండిన భావమీవెక ♦ పన్నగాచలనాయకా 89

మ॥ మూటిమించియు మూటిగాంచియు ♦ మూటిచోటు
[వరించి యా
మూటిసిఁ బదమూటిగెల్చియు ♦ మూటిపై గమకించి ము
మ్మూటికవ్వల నూటిదప్పక ♦ మోగియుచుండెడి నాదమే
ఖాటగా గనుగొందు పాయక ♦ పన్నగాచలనాయకా 90

మ॥ నాలుగింటిని జేర్చియుఁ మఱి ♦ నాలుగింటినిగూర్చియుఁ
నాలుగింటి సమిశ్రమించియు ♦ నాలుగింటి వహించియుఁ
యాలవాలంబేమి లేకయె ♦ నంతటఁ విలసిల్లు భూ
పాలసిఁ గొని యానుదేశిక ♦ పన్నగాచలనాయకా 91

మ॥ పంచభూతములఁ జయించియు ♦ పంచభూతగుణాంతమై
పంచశక్తి విలక్షణంబయి ♦ పంచకోశాతీతమై
పంచముద్రల కందరాక న ♦ పారమై విలసిల్లి ప్ర
పంచమెల్లను మించితీవెక ♦ పన్నగాచలనాయకా 92

మ॥ ఆరిటిఁ వధియించియుఁ పది ♦ యారిటిఁ బరిమార్చియుఁ
యారుజేర్చియు నారుగూర్చియు ♦ నారిటిఁ బోకార్చియుఁ
యారుపువ్వులమీదుగా పది ♦ యారుకాంతుల పూర్ణమిం
పార రంజిలు దీవె బాయక ♦ పన్నగాచల నాయకా॥ 93

మ॥ ఏడుకోట్లపదార్థముఁ గొని ♦ యేమికష్టము లేకనే
యేడువార్ధుల దాటనీదియు ♦ నేడుకొండల వాడ యీ
రేడులోకము లెల్లనేలెడు ♦ రేడసిఁ మది గొల్తుకా
పాడ వేమము భద్రదాయక ♦ పన్నగాచల నాయకా॥ 94

మ॥ ఎన్నశక్యము గాక నిత్యము ♦ నేకమయ్యున నంతమై
యున్నిలోకము లందు నిండి స్వ ♦ యం ప్రకాశవిశేషమై
మిన్నుమన్నునుగాక వెల్గున ♦ మేయదేశికరాయ యా
పన్నులను రక్షించుఁ బాయక ♦ పన్నగాచల నాయకా॥ 95

మ॥ చారునీల పయోధరంబుల ♦ సౌరుగేరు శరీరముం
మారకోటి వికాసమౌ సుకు ♦ మారముం దయమానశృం
గారమోహనరూపముం గల ♦ కైటభాసురశిక్ష యిం
పారగా గనుపించవేయిక ♦ పన్నగాచల నాయకా॥ 96

మ॥ ఘోరకిల్బిష దూరసద్గుణ ♦ కోవిదాళి హృదబ్జ సం
చార జన్మవితండవారణ ♦ సర్వలోకశరణ్య వి
స్తార భారనివారణాఖిల ♦ తత్వరూపరమేశ యిం
పార బ్రోవగదయ్య నన్నిక ♦ పన్నగాచల నాయకా॥ 97

మ॥ దాసదోష నివారణాసుర ♦ దర్పశిక్షణ శౌరి ని
ర్వ్యాసవాఖిల దీనరక్షణ ♦ భాసమానవిలాస వి
ద్యాసమేత సుధీమణీవర ♦ ధర్మమార్గ విహారణా
భ్యాసవశ్యక రాతశోషక ♦ పన్నగాచల నాయకా॥ 98

మ॥ మత్తకోకిల వృత్తముల్ సుమ ♦ మాలగా జతగూర్చితిం
చిత్తగింపుము వేంకటేశ్వర ♦ శ్రీకరంబుగ సత్కృతిం
యుత్తరిం సకలార్థసౌఖ్యకము ♦ లీయవే పరమేశ్వరా
పత్తమోర్క సుభద్రదాయక ♦ పన్నగాచల నాయకా॥ 99

మ॥ శ్రీవుళారికులాబ్ధి చంద్రుడ ♦ శేషయార్యవరేణ్య నే
వావరుండ బుధాళి సంగమ ♦ వాంఛనీయుడ సత్యభా
మాపురిన్ నివసించు వాడ న ♦ మస్కృతుల్గొను వీరుడా
ప్రాపుమీరగ జేసెవారక ♦ పన్నగాచల నాయకా॥ 100



శ్రీ సిద్దేశికేంద్రులవారిచే రచియింపబడిన

# గ్రంథములు.

---

1. పరమానంద సుధాలహరి      రు. 0—8—0.
2. పన్నగాచలనాయక శతకము      0—4—0.

ఈ గ్రంథములు వలయువారు:-

పులవారి పీరోజబాబు,

సత్తెనపల్లి.

(గుంటూరు జిల్లా)

అని వ్రాయవలయును.

రజిత ప్రెస్, తెనాలి.

